వి. మయకోవ్‌స్కీ



# పుస్తకం నిండా జంతువులే!

"ప్రగతి" ప్రచురణాలయం

వి. మయకోవ్‌స్కీ

# పుస్తకం నిండా జంతువులే!

చిత్రాలు: యన్. చరూషిన్
అనువాదం: పి.పి.సి. జోషి



"ప్రగతి" ప్రచురణాలయం
మాస్కో



ఏనుగు, సింహం, కంగారూ –
పుటకొక బొమ్మ, నీకోసం!



సింహం — చిన్నదీకాదు, చివరిదీకాదు
చూడు, బాగా కళ్ళు విప్పిచూడు.
అదింక కాదు, మృగరాజు
అధ్యక్షుడు మాత్రమే — యీ పుస్తకంలో.

ఈ జంతువు లామా
ఇది తల్లి లామా,
అది పిల్ల లామా.



సముద్రంలో రెండు పెలికన్లు
ఒకటి మరీ చిన్న,
ఇంకో ఎంతో పెద్ద.





ఇదో చలాకీ జీబ్రా,
ఎన్నెన్ని చారలో చూడు!

ఇదిగో, మన పుస్తకంలోకి
నేరుగా వస్తోంది
ఏనుగుల కుటుంబం.
ఒకటి రెండు మూడంతస్తుల ఎత్తు.
చేటల్లా చెవులు,
అటూ యిటూ వూగుతూ
ముఖాన వేలాడుతోంది
తోకలా ఊగే తొండం,

నోటికి ఎడా పెడా
తెల్లగా, వొంపు తిరిగిన బాకుల్లా —
అది
దంతాల జంట.



వీటికెన్ని తానుల బట్టలుకావాలో!
ఎన్ని చెరువుల నీళ్ళూ,
ఎన్నెన్ని మోపుల మేతా కావాలో!
వాటి పిల్ల యెదిగిపోతోంది, చకచకా.

ఇట్టే, మన నాన్న కంటె పెద్ద దయిపోతుంది
కాబోలు!



తప్పుకో, దారియ్యి
ఏనుగుకి
తొండం కదిపేందుకు చాలదు
చోటు దానికి!
ఒకే పేజీ అయితే, ఎంతో యిరుకు
అందుకే ఏకంగా రెండు పేజీ లిద్దాం, ఏనుగుకి!

అమ్మో! మొసలంటేనే పిల్లలకి భయం
దాని జోలికి పోనేవద్దు మనం.
నది లోపల దాక్కుని మసులుతుంది,
అందుకే దాన్నెవరూ చూడ రెప్పుడూ.



ఇదిగో ఒంటె!

ఇసుక ఎడారుల్లో

ఉంటుంది.



రుచిలేని పొదల్ని

తింటుంది.

ఎంతో బరువునీ, మనుషుల్నీ

మోస్తూ ప్రయాణం చేస్తుంది.

ఒంటె అంటేనే

ఏటికేడాదీ

కష్టమైన బరువుల్ని మోసే

బలిష్టమైన జీవి.



కంగారూ

కురచ ముంగాళ్ళ

తమాషా జంతువు.

కాని, వెనక కాళ్ళుంటాయి

దృఢంగా,

రెట్టింపు పొడవు.

ఎంతో పొడవుమెడ
జిరాఫీది
అందుకే దాని పిల్లలు
ఎంచక్కా కావిలేసుకోవచ్చు
దాని పొడవాటి మెడని.



ఇవిగో! కోతులు.
అన్నిట్లోకీ చిలిపివి.
కాని, కదలకుండా
కూర్చోగలవు, బొమ్మల్లా.
ఆ బారాటి తోకే లేకపోతే,
చలామణీ అయ్యేవే, మనుషుల్లా.

పాపం! ఉష్ణమండలపు యీ జంతువు
బొత్తిగా చలికి తట్టుకోనే లేదు.





ఇంక, మిమ్మల్ని అందర్నీ
చూడ్డం చాలిక యీ రోజుకు
వేళైంది నాకు యింటికి చేరేందుకు.



